# ప్రత్యూష

(పద్య సంకలనము)



వివిధ రచయితలు



సాధన సమితి

హైదరాబాదు,

స్థాపితము: ౧౯౩౯

# మా మనవి

'సాధన సమితి'కి పది సంవత్సరాలు నిండినవి. ఈ రెండవ దశకంతో మా 'సాధన' కూడ క్రొత్త బాటలవైపు అడుగిడ కుతూహలపడుతున్నది.

ఇంతవరకు, సమితి సభ్యులైన యువరచయితల రచనలనే మా 'ప్రత్యూష ప్రచురణాల' ద్వారా ఆంధ్రలోకానికి అందజేస్తూ వచ్చాము; కాని యిప్పుడు సభ్యేతరుల్లోని ప్రఖ్యాత రచయితలను కూడా మాతో సహా ఒక్కుమ్మడిగా సాహిత్యారాధకులకు పరిచయం చేయించాలనే సంకల్పం కలిగింది. ఈ ఉద్దేశ్యాన్ని నెరవేర్చేటందుకు చేసిన తొలి ప్రయత్న ఫలితమే 'ప్రత్యూష'.

ఈ కావ్య సంకలనంలో, ప్రధానంగా, తెలంగాణంలోని సుప్రసిద్ధులైన కవుల, కవయిత్రుల ఉత్తమోత్తమ కావ్యసుమాలను ఏరి కూర్చే ప్రయత్నం జరిగింది. కాని, మానవ ప్రయత్నంలోని సహజమగు లోటు పాట్లవలన ప్రసిద్ధులైన కొందరు కవులు ఈ సంపుటిలో చేరకపోయి ఉండవచ్చును; లేదా సేకరించిన కృతులు, ఆయా కవుల ఉత్తమోత్తమ రచనలు కాక పోనూ వచ్చును. ఇంతమాత్రించే సహృదయులైన కవికుమారులు మాపై కినుక వహించక, మమ్మల్ని క్షమించ గలరని ప్రార్థన.

నేడు హైదరాబాదు రాష్ట్రంలో బహుముఖాలుగా విజృంభిస్తున్న ఆంధ్రోద్యమానికి పితామహులైన శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారి పీఠిక మా 'ప్రత్యూష'కు ఒక అపూర్వాలంకారంగాను శుభాశీస్సుగానూ ఉపకరిస్తున్నది. శ్రీ వారికి మా కృతజ్ఞతా పురస్సరనమోవాకాలు.

ఆర్థికంగా మాశక్తికి అతీతమైన ఈ ప్రయత్నంలో మాకు చేయూత నిచ్చిన అభిమానులకందరికీ హృదయపూర్వకంగా కృతజ్ఞతలు అర్పిస్తున్నాము. ముమ్ముందు కూడా మా ప్రయత్నాలను వారు ఇదే విధంగా ప్రోత్సహింపగలరని ఆశిస్తున్నాము.

15 ఫిబ్రవరి 1950
ఈసామియా బజారు
హైదరాబాదు

ఇట్లు
కార్యదర్శి,
సాధన సమితి

# పీఠిక

సాధనసమితివారిచే ప్రకటింపబడుచున్న "ప్రత్యూష" కు పీఠిక వ్రాయు అవకాశమును, గౌరవమును, నాకు లభించినందునకు నేనెంతయు సంతసించుచు, సమితి కార్యకర్తలకు కృతజ్ఞత దెలుపుచున్నాను.

సాధనసమితియను పేరున ఈ సంస్థ ౧౯౩౯ లో స్థాపితమైనది. ఆరంభమునసుండియు ఆంధ్రసారస్వతసేవ ముఖ్యోద్దేశముగాగల ఈ సంస్థపక్షమున, "ప్రత్యూష" పేరుతో నొక లిఖితమాసపత్రికను నాలుగైదు వత్సరములవరకు నడిపింపబడినది. ఇప్పటివరకు సమితివలన ౧౭ పుస్తకముల ప్రకటింపబడినవి. వీనిలో కొన్ని, కొందరు గ్రంథకర్తల రచనలను ఏకత్రముగా ప్రచురింపబడినవి. మరికొన్ని విడివిడిగానున్న రచయితలవి. ఈ రచనలు సాధనసమితిలో సభ్యులుగానున్న మహాశయులవేమైయున్నవి. ఈ సమితినిర్వాహకులు గ్రంథరచనతో సంతృప్తినొందక, ఆంధ్ర రచయితలను ప్రోత్సాహించుటకై, కథానికలకును, ఏకాంకికలకును పోటీనేర్పరచి వానిలో ఉత్తమమైనవానికి తగిన బహుమతుల నిచ్చియున్నారు. ఈవిధముగా సమితివారిసేవ—ఈ ప్రాంతమున చేసినసేవ—యమూల్యమనిచెప్పుటలో అతిశయోక్తి లేదని భావింతును.

సమితివారివలన ప్రకటింపబడిన పుస్తకములు నవ్యాంధ్రసాహిత్యమునకు సంబంధించినవైయున్నవి. వీనిలోని విషయములు, కథానికలు, వ్యాసములు, ఏకాంకికలు, పద్య

ములు, సాహిత్యవిమర్శనలు మున్నగునవి కలవు. ఇప్పుడు సమితివారివలన ప్రకటింపబడుచున్న "ప్రత్యూష" పైవాని లోనిదిగాక యొక క్రొత్త పద్ధతినవలంభించినదని పాఠకులు చూడగలరు.

"ప్రత్యూష" కేవలము పద్యాత్మకము. దీనిలో ౨౮ మంది కవివర్యుల కొన్ని కొన్ని రచనలు ఒకచో కూర్చబడినవి. కొన్ని వత్సరములక్రింద ఆంధ్రమున "వైతాళికులు" అను పేరున క్రొత్తవారును ఉపజ్ఞకలవారునునగు పలువురు కవిశేఖరుల రచనలనొకతావున ఏరికూర్చి ప్రకటింపబడిన పుస్తకము ఆంధ్రపాఠక ప్రపంచమునకు జ్ఞాపకముండునని తలంచుచున్నాను. ఆ గ్రంథమే సాధనసమితి కార్యనిర్వాహకులను "ప్రత్యూష" ను ప్రకటింప ప్రేరేపించినట్లు కానవచ్చుచున్నది. దీనిలోగూడ ఈ ప్రాంతము, అనగా తెలంగాణమున, గడచిన కొన్ని వత్సరములలో రచయితలుగ ప్రఖ్యాతిగడించిన యువ కవుల పద్యములను గేయములను సంగ్రహించి కూర్చబడినవి. 'యువకత్వము' యొక్క మానము (Standard) నిర్ణయించుటకష్టమే అయినను, సమితివారివలన నీగ్రంథమున ప్రవేశమునందిన వారిలో దాదాపుగా నందరును నవీనులును, వయసుదాటని యువజనులలోని వారను అయియున్నారని నా యూహ. ఒకరిద్దరి పేళ్ళుమాత్రము పాఠక మహాశయులకు అపవాదములు గానిరానేరరు.

"ప్రత్యూష" లో ప్రవేశ గౌరవము గాంచిన వారిలో నిరువురు కవయిత్రులు నుండుట చాలయోగ్యముగనున్నది.

దీనిలో వచ్చిన కవిశేఖరుల జీవితాంశములను, సంగ్రహముగనే యగుగాక, పుస్తకపు తుదిభాగమున చేర్చుట చాల మంచి పనియైనది.

ముఖ్యముమీద, సమితివారి యుద్దేశము, తెలంగాణమునయున్న నేటి కాలపు నవ్యకవులను, ఆంధ్రవాచక ప్రపంచమునకు పరిచితులజేయుటయేయని స్పష్టముగా తెలియుచున్నది. ఇట్లనుట, నేటి తెలంగాణములోని యువ కవులందరును ఈ సంపుటమున గానవత్తురని తలంపవీలులేదు. ఇట్టి కవులలో నెక్కువ ప్రఖ్యాతి వహించినవారికి దీనిలో ప్రవేశము గల్గించు కృషి చేయబడినట్లు కానవచ్చుచున్నది.

పైన చెప్పబడిన విధమున యీ ప్రచురణము సమితివారి ప్రయత్నములలో ప్రత్యేకలక్షణము కలది. దీనిలో దోసగులేవైన దూరియుండవచ్చును. అట్టివి కానవచ్చినచో సమితివారి యుద్దేశముయొక్క యుత్కృష్టతను దృష్టిలో నుంచుకొని లోపములు క్షమార్హములుగా భావింపబడునని నమ్ముచున్నాను.

సాధనసమితియొక్క యువక కార్యకర్తల ప్రశంసించుచు, మనఃపూర్వక అభినందనములతో విరమింతును.

"ఆంధ్ర కుటీరము"
సుల్తానుబజారు, హై. ద.
౧౮ - ౨ - ౧౯౪౦

మాడపాటి హనుమంతరావు.

⁂

# విషయసూచిక

# తెలంగాణా విముక్తి

(జైల్లో వ్రాయిన నా "తెలంగాణోపాఖ్యాన"మనే కావ్యానికి ఇది ఉత్తరానుబంధ భాగము.)

అవి తెలంగాణలోన దావాగ్నిలేచి
చుట్టుముట్టిన భీకరాశుభ దినాలు;
అవి నిజాము నృపాలుని అండ దండ
చూచుకొని నిక్కినట్టి పిశాచి కలలు.

నాడు మానవతీ నయనమ్ములందు
నాగసర్పాలు బుసగొట్టి నాట్యమాడె;
నాడు మానవతా నవ నాగరకత
తన్నుదిన్నది రాక్షసత్వమ్ముతోడ.

భారత భామినీ! నయనభాగ వినిర్గత రక్తబాష్ప పూరం
గారిన కాలరాక్షసి వికావిక నవ్విన నిస్వనమ్ములో
తూరుపు ఊరుపున్ విడిచి తొందరపడ్డది తెల్లవారగా
ఘోర నిశా తమఃపటల గుంఫిత నీల నభఃపథమ్ములన్.

పరశు నిశాత ధారలను పచ్చనిగడ్డి మొదిర్చినట్లు, రా
చరికపు టుక్కుచట్టమును చల్లగ ధిక్కరణమ్మొనర్చె ఉ
ప్పురినెడి పేదవాడు, కడుచోద్యము: వెచ్చని స్నానమాడె శం
డితర భామినీ నయనధారల భారత మాతృ పాదముల్.

[illegible]

తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారతభూమి చూపడెనొ లేవొ
విషము గుప్పించినాడు, నొప్పించినాడు
మా నిజాంరాజు, జన్మజన్మాల బూజు.

భారత మాతృగర్భమున బల్లెము గ్రుచ్చిన దుండగీంద్ర వా
ధారముగా నిజాంనృపతి తాళముతీసిన పెద్దపెద్ద బం
గారపు బొక్కసాలు పసిగట్టెను తెల్లదళారి; అంతలో
వేరముసాగె పోరు జరిపింప తుపాకులు దింపుకోసమై.

కోటి తెలుంగు లొక్కమొగి 'కో' యని పిల్చిన యంతలోనె ఆ
రాటముజెంది భారత ధరాతలమంతయు పొంగివచ్చెదో;
'కూటికిలేని పేదలకు గూడను పౌరుషమా!' యటంచు స్త్రీ
కోటిని మానభంగములకున్ గురిచేసిరి ముష్కరాధముల్,

చల్లని మంచుకొండలు భుజమ్ముల మోసెడు భారతమ్ము శాం
తిల్లె నిజాము నీల్గుడులు తేటపడంగలదాక; అంతలో
భొళ్ళున కుండ బ్రద్దలయిపోయెను; భారతమాత డొక్కలో
కుళ్ళిన పుండు కోసి జయగోపురమెక్కె త్రివర్ణ కేతనాల్.

దూరాన నున్న 'చట్టము'
మారాననె మూరె; తెల్లదొంగ నభస్సం
చారియయి పారె; స్వేచ్ఛా
భారతసైన్యంబు తలుపు బ్రద్దలుకొట్టెన్.

ఎదురెక్కియున్న జలములు
నదురై చొరబారె యింటినడుమన్ ; రాముం
డదనున బాణము వదలెను
మద మడగెన్ మాప్రభుత్వ మారీచునకున్.

రెండువందలయేండ్ల చరిత్ర గదుల
కప్పుకొని యున్న గాఢాంధకార మెల్ల
కొట్టుకొని పోయె తూరుపు మిట్టనుంచి
పారి వచ్చిన వెలుతురు వాగులోన.



ఆ చల్లని సముద్రగర్భం
దాచిన బడబానల మెంతో ?
ఆ నల్లని ఆకాశంలో
కానరాని భానువు లెందరో ?

భూగోళం పుట్టుకకోసం
కూలిన సురగోళా లెన్నో ?
నర మానవరూపం కోసం
జరిగిన పరిణామా లెన్నో ?

3 — — — —

పరిత్యాగం

ఒక రాజును గెలిపించుటలో
ఒరిగిన నరకంతా లెన్నో?
శ్రమజీవుల పచ్చి నెత్తుగులు
త్రాగని ధనవంతు లెందరో?

అన్నార్తులు అనాథలుండని
ఆ నవయుగ మందెంత దూరమో?
కరువంటూ కాటకమంటూ
కనుపించని కాలా లెపుడో?

అణగారిన అగ్నిపర్వతం
కని పెంచిన "లావా" యెంతో?
ఆకలితో చచ్చే పేదల
శోకంలో కోపం యెంతో?

పసిపాపల నిదుర కనులలో
మురిసిన భవితవ్యం యెంతో?
గాయపడిన కవి గుండెల్లో
వ్రాయబడని కావ్యాలెన్నో?

కులమతముల సుడిగుండాలకు
బలిగాని పవిత్రు లెందరో?
భరతావని బలపరాక్రమం
చెర వీడే దింకెన్నాళ్ళకో?

# ప్రాగ్భూమి

బొల్లి పడమటి గద్దలు
పొడిచి పొడిచి తిని విడిచిన
అగ్నిసంస్కారం నోచని
నగ్నశవం ప్రాగ్భూమి.

మతాలతో గతాలతో
చితి రగిల్చి పడి చచ్చే
అన్నదమ్ముల చల్లని
కన్నతల్లి ప్రాగ్భూమి.

కరువుల రెక్క చాచిన
మరణాంగ నారింగసంలో
కను మూసిన నిరుపేదల
ప్రళయశాల ప్రాగ్భూమి.

తీగె విడిన దివ్యవీణ
మూగవడిన నాగస్వరం
కదలని వదలని అంతః
కవిసపథం ప్రాగ్భూమి.

బూజెక్కిన కీలుబొమ్మ
రాజులపై జాజు బూని

తాజాగా అమ్మిన అంగడి
బాజారిది ప్రాగ్భూమి.

లక్షలాది పేదల ప్రాణాల్
అక్షింతలుగా చల్లుకొన్న
లక్షాధికార్ల పాలిటి
లక్ష్మీదేవి ప్రాగ్భూమి!

# కవితాకోపం

పాడను,
పాటలు పాడను ;

వాడను
పదాలు వాడను ;
వేడను,
దేవుళ్లను దయ్యాలను వేడను;
ఓడను,
రాజుకు, రారాజుకు
తారా రాజుకు ఓడను;
గోడను,
ధనవంతుల కనకసౌధ
మున కివతల వణికే నిరుపేదల
అడుసు గుడిసె గోడను.

నన్ను చూచి ఎందుకొ
మిన్నాగులు ఇట్లా
పారాడుతు జీరాడుతు
వస్తుంటాయి ?

నన్ను చూచి ఎందుకొ
పున్నాగులు ఇట్లా
తారాడుతు, గోరాడుతు
పూస్తుంటాయి ?

ఇది లోకం
నరలోకం
నరకంలో లోకం నరలోకం!

ఏనాడో తెలుసునాకు
ఈనిరీహ నీరవ
నిస్వార్థ నిర్ధన
నీచ నీచ మానవునికి
విలువ నీడ లేదు జగతి.

లేదు లేదు విలువ లేదు,
రక్తానికి ప్రాణానికి
శ్రమకూ సౌజన్యానికి
రచయితకూ శ్రామికునికి
రమణీ రమణీయ మణీ హృదయానికి
విలువ లేదు, విలువ లేదు.

నేనుగూడ వారి గూండానై
పుండుపడిన గుండెలతో
మొండిపడిన కండలతో
మొండిపడిన గుండెలతో
పుండుపడిన కండలతో
నాట్యం చేయాలేమో !
సాష్టాంట్లనె దోయాలేమో !!

ధూర్జటినై
మూర్ఛిన్ వేయాలేమో ! తః
ధనాష్టనావర, పరిపాకర
నిరుదార నిరంకుశ
నీరస నిస్తేజ లోకానికి
మూర్ఛిన్ వేయాలేమో

ఫాలనేత్ర విలయాగ్ని మాలతో
నీలగాత్ర విషవగ్నికీలతో !!

దాశరథి కృష్ణమాచార్యులు

# ఆరాధన

పసిపాప నవ్వులో - ప్రత్యూష రేఖలో
చిరుకన్నె కులుకులో - తొగకన్నె వంపులో
చూలాలి నడకలో - చలి వెలుగు అడుగులో
కలతపడు హృదయాల - గర్భిణీ మేఘాల
తొంగలించెడి శక్తి - తొణుకులాడెడి శక్తి
కంజలిడుదు ;

తొలివాన చినుకులో - ప్రియురాలి పిలుపులో
పసిపైరు మిసిమిలో - ముసినవ్వు కొసరులో
వరిపాల కంకిలో - సఖిపూల యెడదలో
బాలింత చేలలో - పసిపిల్ల తల్లిలో
తొంగలించెడు శక్తి - తొణుకులాడెడు శక్తి
కంజలిడుదు ;

నడిప్రొద్దు ఎండలో - యవ్వనపు కండలో
మునిప్రొద్దు ముసుగులో - పండినా బ్రతుకులో
నడిరేయి కడుపులో - కనుమూయు బ్రతుకులో
తొంగలించెడు శక్తి - తొణుకులాడెడు శక్తి
కంజలిడుదు ;

గడ్డిపోచలకైన మొక్కవోవని
నల్లకొండలా గుండెలన్

ప్రత్యూష

చీల్చుకొని చిగురించు
తలిరాకు తీవలో

విసము గ్రక్కుచు నిక్కి బుసకొట్టు
నల్లత్రాచులా గుండెలన్ కరగించి వూగించు
నాగుల్ల పాటలో
తొంగలించెడు శక్తి - తొణుకులాడెడి శక్తి
కంజరిదుదు.

# భిషక్కు

ఉషః సంధ్యల పండిన బంగారం
కరగించుక త్రాగిన
కాలానికి కరువునెప్పి వచ్చింది;
నయంచేసే భిషక్కు ఏదీ?
గానంచేసే రసజ్ఞుడేదీ?

సామ్రాజ్యాల్ తెగమ్రింగిన
కాలెడు కడుపుల ఆకలి త్రాగిన
లోకానికి క్షయరోగం వచ్చింది;
నయంచేసే భిషక్కు ఏదీ?
గానంచేసే రసజ్ఞు డేదీ?

ముసలి బాటల ఘూల్గుచు నడిచే
సంఘానికి చత్వారం కలిగింది ;
నయంచేసే భిషక్కు ఏడీ ?
గానంచేసే రసజ్ఞుడేడీ ?

# తెనుగు మొర

తేనెలు పిండే తెలంగాణము
నెత్తుట ముంచెత్తెదరా ?
తెప్పరిల్లిన, ఈ తెలంగాణము
కుత్తుక బట్టొత్తెదరా ?

తెనుగు తల్లుల పాలు త్రాగిన
ఓ నా తమ్ముల్లారా !
తెనుగు తల్లుల ఒడిలో పెరిగిన
ఓ నా అన్నల్లారా !
తేనెలు పిండే....
అటు చూడుడు అటు ! అటు
చూడుడు !!

కన్నులు విప్పీ మరికనుడూ
తుమ్మపూల తురాయి పెట్టుక
తళ తళ లాడే తటాకలక్ష్మి

వెల వెల పోయిందీ—
అడవుల పాలై ఆలమందలు
దొక్కలు వాల్చుక దిక్కు
మొగముతో
దిక్కులు చూసేనూ...
తేనెలు పిండే...
అటు చూడుడు అటు! అటు
చూడుడు !!

కన్నులు విప్పి మరికనుడూ
మేడలు కూల్చిన మనకేమొరుగు ?
ఒకటికి రెండూ కట్టండోయ్—
అడవులు మనవే, నేల మనవే
ఒకటికి రెండూ కట్టండోయ్
తేనెలు పిండే...

పీకలు కోసీ ఇళ్లుదోచీ
ఏమది సాధించినదీ ?
ఒక పీకకు పదిపీకలు బలి —
ఒక ఇంటికి పది ఇళ్లూ మట్టం —

తల్లికి బిడ్డా తండ్రికి కొడుకు
మగువకు మొగుడూ కనబడక

అధిపము శుభమెరుగ నమాయకపు
తెనుగు లలమటిస్తున్నారు—
తేనెలుపిండే తెలంగాణము
నెత్తుట ముంచెత్తెదరా ?
తెప్పరిల్లిన ఈ తెలంగాణము
కుత్తుక బట్టొత్తెదరా ?

# స్వాహా

అతడు పంటకు వచ్చిన పైరు—
ఆమె నీరు దిగని నీలం—

తను పెంచిన అవినీతికి
తను పంచిన పంచాగ్నికి
రగిలి రగిలి అగ్గయైనా దరకు—
అతని ఎదమంటల కాకకు
కళ తరిగి బొగ్గయిందామె—

కూలిన ఆ జంట మీద
వీబూది పెట్టుకొని
మడి కట్టుకొని
నంగనాచీ లాగ
కొంగ జపం జేస్తు
కూరుచున్న దీ కపట లోకం—

ఎవని కళ్లు మూయుటకు ? మ
రెవని ఇల్లు దోచుటకు ?

భాగి నారాయణమూర్తి.

వర్షిష్యా ష

# మహత్త్వాకాంక్ష

నీచేయు పనిఏదో నీవు చేయుము కాని
అన్యులను నీవేల అనుకరించెదవోయి?

ప్రత్యేకముగ నీవు
పట్టింపుతో చేయ
వలయు కార్యం బొకటి
కలదు ఈ భువి సఖుడ !
ఆ కార్య మివుదప్ప
అన్యులతొ కాదోయి. నీ॥

చిలుక పలుకులు పలుక
శృంగార మెవ్వరికి ?
నీ ఆత్మకే నీకు
నిండులేనిచొ యింక
ఏరి సంతృప్తి కిటు
ఈ ఆటలాడెదవు ? నీ॥

అనుకరణలో క్రమగ్గి
ఆత్మజంపెద వేల ?
ఆత్మ వ్యక్తీకరణ
అదె సృష్టి పథమోయి. నీ॥

ఒరుల దుస్తుల దాల్చి
ఊరేగుటయు మరవు !
రాజ రాజువు సరియె
రాజెంపు నీకేది ! సీ॥

మెఱమెచ్చులకు నీవు
మురిసిపోవగ దలచి
వెనుక ముందూ లేక
అనుకరింతువు ఒరుల !
మాయ, మోసం బెపుడు
మహి నిల్చునా హితుడ ? నీ॥

పలుకుమని నిన్నెవరు
పాడుమని నిన్నెవరు
బ్రతిమిలాడిరి, హితుడ !
బలిమిచేసిరి సఖుడ !
పాడినదె పాడుటకు
ప్రళయ మింతేమిటికి ? నీ॥

కోకిల పాటేదో
కోకిలయె పాడాలె
కాకి పాడిన నెటుల
కనుపించునో చెప్పు ? నీ॥

పరుల గొప్పల పైని
భ్రమపడల నన్నాళ్ళు
నీ గొప్ప ఏమిటిదొ
నీకు తెలియదు సఖా !

నీ పలుకు ఏదైన నీ పాట ఏదైన
నీ అంతరము నుండె నీటుగా రావలయు. సి॥

# జీవితము

జీవచ్ఛవముగ ఏటికి
చిరకాలము బ్రతుకవలెను ?
ఒక్కగడియ చాలదోయి
ఉజ్జ్వలమగు జీవితమ్ము !

జీవించుట యనినసుంక
జీవించుట కాదెప్పుడు
జీవమె లేకున్న నద్ది
జీవన మెటులగునోయి ?

జీవము నీ జీవనముతో
చిందులాడవలెనన్న
జీవితమునె బంగినీవు
జేసి తీరవలెనోయి.

పిడికిలి బిగియించి నీవు
పేరమాడ దలచినావ ?
మూల్యమివ్వకీ జగతిని
ముట్టలేవు ఏవస్తువునైన !

నీకు వలయు వస్తుచయము
నిఖిలముయిట లభియించును
మూల్యము సిద్ధముచేయుట
ముందు నీదు కర్తవ్యము ;

కాసయినను చేతలేక
కామితార్థ మెవడుపొందె ?
గుడ్డిగవ్వ కొనుటకైన
గుడ్డిగవ్వ కావలయును !

పిడికిలి బిగియించినీవు
బేరమాడలేవు ఎపుడు
నీ చేయె ఆడనిచో
ఏచేయి ఆడునిచట !

ఔశ్చర్యంబుగ జగతిని
అలోకన జేయ ఫలము.
శక్తి ఉన్న బేరమాడు ;
చాలనిచో దయచేయుము.

పొట్లపల్లి రామారావు

# సారస్య పటిమ

గుమ్మ పాలల్లోని గోరెచ్చదనము
తమ్మితూడుల గ్రమ్మి తరలు సూత్తుల్లు.
అరటి పూవులలోని అందంపు సిగ్గు
పరువెత్తు పిన లేడి బరువంపుశైలి.

బీరపూవులవోలె విచ్చుభావాలు
కోరకంబులదాగు క్రొందేనెరుచులు,
వెలుగు కంటికి రెంట విడిపోనిజంట
వలపింపజేయు శబ్దార్థ వైచిత్రి.

జంటబాసిన గువ్వ సాగించురొదలు
పంటబోయిన రైతు పలవించురీతి
అంబాయనెడి లేగ ఆవేదనంబు
సంబోధనలకొత్త సారస్యపటిమ.

తొలికోడి కూతగా తోచుజ్ఞానంబు
తెలవారు చుక్కగా తీరించునాశ
దుష్టుల పేగులే తోరంబులొప్ప
కష్టజీవులకునై గంగావతరణ.

అందరకు అందింతు మానంద మెప్పుడు
సుందరోద్యాన హృత్సుమ శీకరముల.

పులిజాల హనుమంతరావు

# మ ధు రో హ

నా శక్తిని విన్నారా!
నా బలమును గన్నారా!
నేనొక విషాదగీతిని
నేనొక విశుద్ధ హేతిని
నావొక భయంకరాస్త్రం
నా కలమే బ్రహ్మాస్త్రం,

నా పాళీ కనురెప్పలు
పుర పుర బొక్కి పొక్కి
పొరలించిన సెలయేరుల
జలవాహిని
తరతరాల తరబడిగా
తలలను నిక్కించి లోన
చలనము రవంత లేక
సమాజ సౌందర్యానికి
సమాజ సౌభాగ్యానికి
దారులు నిర్మిస్తూంటే
దోవల కడ్డము నిలిచిన
కొండల ఛేదిస్తుందోయ్!
బండల కరిగిస్తుందోయ్!!

పర్ తూ్యష

మండుటెండ వడ తాపున
ఎండి ఎండి జీవించుటె
దండుగయని,
వాడిన కోర్కెలు దొడిగి
వీకిన యాసల దలచి
విల విల లాడుచు మూర్ఛ
పొలాల గుండెలు తడిపి
రాజనాలు పండిస్తుందోయ్ !
భోజనాలు నిండిస్తుందోయ్ !!

నా పాళీ వాతెరలో
రూపొందిన లేనగవులు
హవాయి చువ్వల్లాగా
వెన్నెల బాంబుల్లాగా
ఎగసి యెగసి పైకెగసి
వెలివెలుగుల జడివానలు
జలికిస్తే
సమాజ సౌధాంగణమున
యుగయుగాల నాశ్రయించి
బిగిసి బిగిసి
బిరిసి బిరిసి
దిబ్బలుగా పాదుకొన్న
చీకటి దయ్యాలు కరిగి

ఏ కడకో ప్రవహిస్తాపోమ్ !
రోగాన్ని వదలేస్తాపోమ్ !!

మొలిచిన నా పాళీ
కొసనొక్కులు
సమాజ రక్తమునంతా
సమాజ పూజల పేరున
ఆ యుగమును లాలించి
ఆరగించి
వెలిగిన దీపాల పొడిచి
నివురున ముంచేశాపోమ్ !
వెలుగకుండ జేశాపోమ్ !!

నా కలం
ఖడ్గం
మనుష్యుని కుసుమ శరీరం:
వెన్నెల ఉప్పులు ఒన్ని
సమాధినీ హృదయాన్ని
వృక్షంపాయ చేసిందానాడు;
మదనుని మంటల కొడిరో
గిరి కన్నెను పొందించి
మల మల మాడ్చిందోమ్ !
వల వల యేడ్చిందోమ్ !!

నా కలం
నేడు
బలరాముని హలం;
తెలుగువారి పొలాలనుమ
చిరకాల్వల తీర్చిదిద్ది
పసిడి దోదెలను దోసి
బంగారం పండిస్తుందోయ్ !
నూతన
శృంగారం సృష్టిస్తుందోయ్ !!

నే నెవరో
నన్నెరుగరు;
కవిని — కాదు
గాయకుడను
శిల్పి నంటారేమో-
అదిగా దిదిగాదు; నేను
మధురోహను !
మధురోహను !!

లోకాలను దాటిపోయి
ఆకాశపుటంచులలో
విహరిస్తా నొకసారి;
పేదవడిన జాలిగుండె

పొదలోనే నా పొదలు:
కాంపు గట్లను త్రెంచి
చేలల్లో తిరుగుతాను
మాలల్లో మసలుతాను.

నే నొక
సుఖరోహాను
మధురోహాను.

# అన్వేషణ

వెదకి ప్రాణాలప్టై ఎసుగెత్తె, నీ జాడ
నెరుగ నీ వెడుంటివో కదే ప్రియసఖీ!

కులుకు బంగరు కిళల
నొలకించు తొలిప్రొద్దు
పడుచు మొగమునుజూచి
భ్రమసి పోయితి నీవు
నునుపు చెక్కిలి కొనల
దొనసు రేత గులాబి
నవకంపు క్రొంబూత
నాట్యమేమొ నటంచు! ||వెదకి||

పరిత్యాష

ఈ వసంతపు సంజ
దోసిలో మెరుగారు
కావిమబ్బుపై రంగు
కదలి యాడిన యంత
కలికి నీ పెదవిలో
మొలకెత్తు చిరునవ్వు
చిలుక కెంపులటంచు
దలపోసి వెదకితిని ! ||వెదకి||

చివురు దొడిగిన రెమ
చేసె కౌగిట
పూవుబోడి కన్నుని
తేనె పుక్కిలింతలలోన
నీ మోవి తేనె వాకలు
నిండి పారునని
తలచి వెదుకాడి నే
నలసిపోయితి చెలీ ! ||వెదకి||

కొండ కోనల నిదుర
కూర్కెరుంగక రేయి
కొదసేయు వెంమేటి
కొనపు పాటలు వెదికి

దవిలినంతనెరేటి

తడవిహొందును సీదు

చెలువంపు పీనీయయి

పలికె నేమోయంచు. ||వెదకి||

ఈరేయి చలువ వె

న్నెలలో గుబాళించు

పూవు కన్నెల వంపు

తావులను కొల్లగొని

మెల్ల మెల్లగ దాటు

పిల్లగాడుపు మేన

సోకినంతనె నీవు

సోలి వ్రాలిపవసుచు

చీకాకుతో దిగ్భ్రమను

జెంది వెదకుదును. ||వెదకి||

పసరుబట్టిన మొలక

ప్రాయంపు చేలలో

దెస దెసకు నీ మేని
కొసరు టందాలకై
నిలువెల్ల కనులతో
నే వెదకి వేసరితి. ॥వెదకి॥

ఏ తెలుగు కన్నె కోయిల
కలుపు పాటనో ?

ఏ తెలుగు గొల్లపిల్లన
గ్రోవి యూపునవా ?

ఏ యడవి కోననో
ఏ మొయిలు నీడనో ?

ఏ పేద కన్నీటి
యేటి దరిదాపునవా ?

ఏ జాలిగుండె మరుగున దాగినావో
నీ వేదనుంటివో ? ॥వెదకి॥

ధవళా శ్రీనివాసరావు

# ప్ర బో ధ ము

సీ. ఆంధ్ర సామ్రాజ్య సింహాసనాంచిత
విస్మయావహ మహో విక్రమంబు
సర్వజ్ఞ సింగమ క్ష్మాపాల సాహిత్య
పాండిత్య చిరయశః పాటవంబు
వివిధ దేశఖ్యాతి విలసిత "ఎల్లోరా
జంతాగుహా" శిల్ప సౌష్ఠవంబు
ఢిల్లీ సురత్రాణ ఫల్లాయి తాక్కన
మంత్రీంద్ర ధీశక్తి మందసంబు

గీ. మరచి నడపీనుగుంబోలె తిరుగు నిన్ను
వెలికి గొనివచ్చి వెలిగించు విజయదినము
వచ్చి యున్నది పూజింప వలయు లెమ్ము
మేలుకొమ్మోయి! ఆంధ్రుడా మేలుకొమ్ము.

సీ. పలికించినారు శత్రులు పిల్లకంబంత
రక్తులంపై మీ గాథలెల్ల
చిలికించినారు చంచల చిత్తులను ప్రీతి
నుపనిషద్వాఙ్మయపీయూషవృష్టి
వినిపించినారు దర్పిత పంతిరాశికి
ఓరాంగ విజయ భేరీరవంబు

గడియారం

గడపినారలు రాతి కటుకు గుండియలకు
మందార మంజరీ మార్దవంబు

గీ. నింగి కెత్తించినారు నిర్నిద్ర శౌర్య
సాహసౌదార్య వినయ రత్నధ్వజంబు;
పూర్వ జాతీయ గౌరవాభ్యుదయమైన
తలచి నడుము బిగింపవా తెలుగువాడ.

సీ. గ్రీకుల దాడికి చీకిన నీరితో
సకల విజ్ఞానంబు నడుసిపోయె
పరమతా సహనంబు బాపిన బుద్ధిరో
వేద వేదాంతాల విలయమయ్యె
తురకలు గూర్చిన దుర్గాలతోడాటు
మతశిల్ప శాస్త్రముల్ మంటగలసె
ఆంగ్లేయులార్పిన ఐకమత్యంబురో
రాజ్యాంగ తంత్రంబు భ్రష్టమయ్యె

గీ. కొంప గాలినదని మొత్తుకొనుచునుండ
దొంగ జొరబడి దోచిన భంగినున్న
మన పరిస్థితి సరిజేసి కొనుటకైన
చేయిగల్పుడు ఆంధ్ర దేశీయులార.

గడియారం రామకృష్ణశర్మ

ప్రత్యూష ...

# ఋతు త్రయము

మానవ జీవితమ్ము మధు
    మాస వసంత మనోజ్ఞ శోభతో
వాసలతో, మహాశిశిర
    వాయుపరోధ ఋతుత్రయంబు పెన్
కాసల మారినట్లు కల
    గా పులగమ్మయిపోయె పేదకున్
వానలు కొల్లలౌను, చలి
    బాధలు హెచ్చు, వసంతముల్ ఋతుల్

మానవులలోన ధనికుడు మాన్యుడగును
ఆకలికి రోయువాడు పుల్లాకుసుమ్మి!
అందు ప్రథముని జీవితమంత సుఖమె:
మొండివాన రెండవవాని గుండెలందు.

చైత్ర వైశాఖమాస వాసంతశోభ
ధనిక లోకంపు విశ్రామ ధామమయ్యె;
శ్రావణాషాఢ నిబిడ వర్షనిపాత
మమ్ము పేదను మృత్యు ధామమ్మయియ్యె.

పర్వా జానకీదేవి

# సఖ్యం

నీ లాస్యము పాయసమైతే !
నా ఆస్యము ప్రేయసమైతే !
నీ చూపు ద్విరేఫంబనగా,
నా దాపులు సఫలంబనగా,
ప్రేమ లతాంతమున వసింతాం !
దామ హృదంతమున వసింతాం !!

నీ మంజుల మంజీరందే
నా రంజిత కంజాతందే.
నీ యానము నిట్టూరిస్తే
నా గానము లొట్టలువేస్తే
భావసుమాధ్వమున వసింతాం !
రావ సుమూర్తమున రసింతాం !!

నీ శోభా ప్రాభాతంలో
నా స్వాభావా ఘాతంలో
నీ హృదయము మధురంపైతే,
నా పథకము విధురంపైతే,
ఆ శాసిత వసతి వసింతాం !
భాసాకృత విస్మృతి రసింతాం !!

నీ సుందర నిరావృతంపే
నా మందరకరా వృతంపే,
నీ మనసాక పిచ్చెన వేయన్,
నా గుణమొక పచ్చన రాయన్,
ఫాగమృదంగముల పసింతాం !
రాగ పింగముల పసింతాం !!

నీ ప్రణయము నిస్తులమేమో !
నా అనునయ మతులంపేమో !
నీ భావపు ప్రాభవమిల్లై,
నా భావికి లాభములల్లై,
సూనాంగణర లినిపసింతాం !
ప్రాణంబుల కలిపి పసింతాం !!

నీ హసనము ప్రసవంబగురే !
నా పసనము అసదృశమారే !
నీ ఆడినగాత్రము పొగులన్
నా పాడిన గీతము పగులన్,
ఖ్యాతోపక్రమత పసింతాం !
జ్యోతిశ్చక్రమున పసింతాం !!

నీవే యొక మృదువాక్యమువై !
నేనే యొక మధుకావ్యమువై !

నీ విరహము నిర్వ్యాజముగా
నా దరహాస ముర్వీజముగా,
పూవులలో తావులమౌదాం !
తావులలో పూవుల మౌదాం !!

నీ శిల్ప మహాన్యాసము నేనై,
నా అల్పవిపర్యాసము నీవై,
నీ భంగిమమే రంగులు గాగా,
నా యింగితమే పొంగులు వోగా,
చిత్రాకాశము చేరపడోదాం !
యాత్రాపేశల పారముచూదాం !!

నీ హావంబున నేనైతే !
నా భావంబున నీవైతే !
నీవే కోకిల ముగ్ధవుగా,
నేనే హర్ష మయూరునిగా,
ఆ వసంతమున నాలాపిద్దాం !
ఆ వర్షంబున నాటల నాడ్దాం !!

నేనే నీవై, నీవే నేనై !
నీవని నేనని లేకుండా,
నిఖిల జగత్తున నిభృతులమై,
సఖుల వియత్తుల కథకులమై,
దుఃఖలోకమును ఆశ్వాసిద్దాం !
సఖ్యజీవులుగ నిశ్వాసిద్దాం !!

బెల్లంకొండ

★

# ఫాల్గుణ బహుళ అమావాస్య

"ఎంత లేండోయి విశ్వము నిండిపోవు
చున్నదో గాథ సౌభ్రాతృసామ్రాజ్య!"
అనుచు కేకలు వినబడ నదరి లేచి
చూచినాను——
మోదుగుకొమ్మ జుట్టునింత
మండుచున్న పూలు గట్టి మాయమైరి
ఎవ్వరో!
తేటి పిండులు ఎగసినట్లు
పొగలు గ్రమ్మెను!
నేలపై, పొట్టపండి
పట్టుకున్న పచ్చ్కటకకు మాత వలెను
ఎవరుగని పల్కరించని వృద్ధ దేహ
ములు, దరిద్రభారమ్మును మోసికొనుచు
పోవుచున్నది మంటకో, పొగలలోకి
ఎందుకో! ఎవ్వరో!!

గుండెలు జల్దరించి కనుగోనలు మూసుకపోయె నాకు! బ్ర
హ్మాండము పిక్కటిల్లినటులాయెను భావము వాక్కుకందక౯!
దండిగ కొంతసేపటికి దాపున జూడక జూచినాను ఏ
కొండలలోనికో! పథిక కోకిల రాగపురేఖ విన్పడె౯!!

పరిత్యాష

ఆకలిబాధతో నవయుహార్ద కృశోద్గళ భావ భార మే
దో కల నాదజీవిత పథూదయ దర్శనమయ్యె! తంబురా
తాకుచు జీర్ణసాగర కథాకళి నృత్యపు పొంగు, క్రుంగులన్
వ్యాకుల గీతిబాడె ముది వగ్గగు భిక్షుకి నన్ను జూచుచున్!

"పండిన యాకు లేపగదిపడ్డవొ చూచిరేకదా! ఇకన్
మొండిగనున్న యా ముదుస మొప్పులదూయుడ క్రౌంచిపుళ్లనే
పండుగచేయుడో ప్రజలు! భాగ్యవిహీనుల్లు లేమ, హాలవో
దంతలు దండలౌచు వసుధన్ సుధగా మధుధార దేర్చెదున్!"

అనుచునె వచ్చి దగ్గరకు అర్థముకానివి పాట లెవ్వియో
వినుచుచునుండె! నా యెదను వేడిమి నాడ్పులు వీచి దేహమె
ల్లను చిరుచెమ్మటల్ విసిరె! లజ్జ, భయంబును బుల్కరించె! సం
తనె కనుచుండగా, నొక లతాంగిగ గన్పడె మాఘ వీణరో!

ఆ సౌందర్య మహాః ప్రవాహమున నేమైనానొ! నా గుండెలో
దూసెన్ బోలును మోడుటాకు, లిక వాదుల్ సేతు రో కోకిలా
శ్రీ సమ్మోహగళల్! వియచ్చర ప్రమద హంసీ పాద నాదామృత
ధ్యాసన్ ఆశలు ప్రాకులాడి, భ్రమరీ ధమ్మిల్లమున్ గాంచితిన్!

శారదా ప్రియస్వి నీ రమ్య ముగ్ధాక్షు
లలర, ఒదిగిచూచి పలుకరించె!
వీణమీద కరము విప్పారనేలేదు
పెదవి కదుపలేదు పృథివి మ్రోగె!!

"రమ్మ రమ్మోయి సఖుడా విరాగమేల !
విశ్వమంత వసంతము వినవొ—కనవొ ! !
ఋతు మహో ధర్మచక్ర పరిభ్రమణము
తిరుగానె కాలము రూపు మారునోయి !

నీ గళాన రసము నిండింతు నీవేళ !
నీ కరాన చిగురు నిలుపుదాన !
హిమ శిశిరదవార్చు తెగసిన విశ్వాస
భావ పుష్పవృష్టి వరపుమోయి !"

అనుచు నెదురువచ్చి ఆలింగనంబున
ఎత్తెనేమొ నా తలెత్తిచూడ
నిజమొ ! అనృతమేనా ! నే నమ్మలేనైతి
తెల్లవారుజాము తియ్యనికల ! !

బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

# సెలయేరు

కనుమేర దూరాన
కనుపించు నా కోన

నల్లనౌ తల కొంత
నరసి పండినదేమొ!

నరపుగాదది నల్ల
నల్లనౌ తలమీద

తెల్ల మల్లురుమాలు
తీరేమొ కనుపించు!

మల్లుపాగాలోని
మలకలవి యొక కొన్ని

చెదరి గాలికి చాల
చెలరేగె ననిపించు!

కాదు, నల్లనిరాతి
కంబళంబున మూది

మేకిపోసిన రాశి
మేకమైనటులుండె!!

పైనున్న యారాశి
పాల సంద్రమటంచు

మలకపై మెలిపడుచు
మడుల విడివడి సుడులు
తిరుగుచును పొరలుచును
నురుగులయి పరుగిడుచు,

దండిగుండులుకొన్ని
పిండిగొట్టుదునంత
చెలరేగి గుంప్రాళ్ళ
చెండ్లాట లాడుచును,

పచ్చి ముత్తెపు సేసఁ
బ్రాల జల్లులతోడ
తను తొంగిచూచు భా
నుని పూజలను సలిపి,

సూర్యుడును చంద్రుడును
చుక్కలన్నియు గూడి
మోసులెత్తిన క్రొత్త
మోహంపు మైకాన

పవలు రాత్రియు వెంట
పరువులెత్తుచు నుంట
అందరను తనయందు
ఐక్యమొనరించుకొని

జలజలా జలజలా
జలజల ధ్వనులతో
తలపోలమ్ములలోకి
తాచూరె సెలయేరు.

4

సానుపుల శిఖరాళి
తో నేకమొనరించి
ఆసు దోసినరీతి
నటు నిటుం దిరుగాడి,

పాదరసపుం గుండ,
పగిలి పారె ననంగ
మరకతపు పచ్చికల
మళ్ళలోపల దూరి,

నికటస్థలము లెల్ల
నిగనిగన్నిగలాడి
చూచువారల కనుల
దోచుకొనునటుచేసి,

పంటచేడియ ఆకు
పచ్చకోక పయంట
ముత్తెంపు జలతారు
మురుపుపోతలుపోసి,

నాగుబాములు కొన్ని
నడయాడునటులుండె

నెత్తిగాదది కొండ
నెత్తమ్మె యగు సుమ్ము

నరపుగాదది మంచు
టొరపు పరపగుగాని !

మల్లుపాగాగాదు,
మటి చూదియునుగాదు

నడయాడు నిడుపాటి
నాగుబాములు కావు;

కొండ నెత్తమునుండి
రెండు మూడుగ జీలి

జల జల ప్రవహించు
సెలయేరు లగుగాని.

2

కొండపై వారెవరొ
వెండి గరగిన నీరు

కుండతో గుప్పుమని
కుమ్మరించిన భాతి,

స్వర్ధునీ వీచికల
జల్లులాడెడి కరుల్

తొండాలతో ముంచి
తూరుపెత్తినరీతి,

పంచుకొలకుల తాన
మాడిలేచిన దివ్య

వారకామినియాస్త్రి
వసనాంచల మనంగ,

వేయికన్నుల తెప్ప
వేయకే సురరాజు

పదిలపరచెడి సుధా
భాండంబు దొరవెనన,

తళతళ త్తళతళ
త్తళతళత్కాంతితో

జలజలన్ జలజలన్
సెలయేరు ప్రవహించు.

3

ఉత్తుంగ శిఖరమ్ము
నుండి యటు పయనమై

ఆడాడ పల్లమ్ము
లందెగిరిపడి దూకి





దోరపూవులు కొన్ని
దోసిళ్ళ గోసికొని

పరిమళము మైనిండ
పట్టించుకొని లేచి,

దారికడ్డుగనున్న
తరుల మూలము దూరి

పక్వఫలముల పుడమి
పడ రాలగా గొట్టి

ఫలరసా స్వాదనా
బలమెసక మెసరగా

పూల సొమ్ముల నాదర్
భూషించుకొని మురిసి,

కలనాదమున నెదప
పులకితంబగు నంత

నలుదెసలు వెలుగ చిరు
నగవు చూపులు విసిరి

ఎందు చూచిననాని
యెదురెవ్వరును లేక

ఇచ్ఛా విహారమ్ము
నిటు కొంతతరి సలిపి,



41

ప ల్లా ............................................ ★

చిటిపొటినడల హం
సిక వోరె సపుడెగి

చంద్రికాకాంతి, వా
సవసజ్జ పోలికను,

చెలిమితో ప్రకృతి, స
జ్జితము చేసిన మిసిమి

యిసుకపాన్పున బవ్వ
ళించె నా సెలయేరు.

# మామ

మామామ వచ్చిండు
మాకేమొ తెచ్చిండు,

మంచిము త్యాలివే
పంచుకొం డన్నాడు,

బొండుమల్లెలు కొంగు
నిండ విర చల్లిండు

దండ అల్లిన నల్లు
కొండుమీపన్నాడు.

పరి త్యా షా —— —— —— ——

పచ్చిపాల్ తెచ్చిండు
పారనే పోసిండు,

ఎత్తుకో గలరేని
యెత్తుకొండన్నాడు.

అమృతభాండము తెచ్చి
అటుకుపై నుంచిండు

అందుకో గలరేని
అడ్డ మెవరన్నాడు.

పలుగురా కొండెక్కి
పగలబడి నవ్విండు,

పట్టుకో గలరేని
పట్టుకొండన్నాడు.

దొరవోలె వస్తాడు
దొంగవలె పోతాడు,

కనుమూసి తెఱచులో
కనపడడు మామామ.

ఎంచిచూడగ చాల
మంచివా డాతండు,

చల్లదనముల పుట్టి
నిల్లగును మామామ.

దొడ్డగుణముల వాడు
దొరతనము గలవాడు.

నలుపెల్ల దిగమింగి
వెలుతురే వెదజల్లు.

మామామ కడుపులో
మచ్చగను పెట్టుంది.

లోకోపకారమై
చీకట్లు మింగింతో.

మామలకు మామ. రా
మాచంద మామ.

మామ మామకు మరిది
మా చందమామ!

పల్లా దుర్గయ్య

# అంజలి

ఉ. శ్రీ లలనామణిన్ గలిసి ప్రీతిగఁ గాపురముండ్రుఁగాత మి
మ్మేలు తెలుంగు శారదకు; నెయ్యెడఁ గాంచిన దేశభాషలం దే
మేలని కీర్తిన్ గనుచు మేదిని భాసిలు కన్నతల్లి మా
పాలిటి కల్పవల్లి సుతపాళి నివాళులఁ దేలి మేలుతన్.

సీ. శాలివాహనరాజచంద్రులేల్పడి
నిగ్గు దేరినపంటనేల యిద్ది:
చాళుక్యభూమీంద్రసమదసామజదాన
ధారలఁ దడిసినధరణి యిద్ది:
కాకతీయనృపాలఖడ్గధారల శత్రు
పంకముల్ విరిసినవసుధ యిద్ది:
విద్యానగరరాజవీరసంక్రోష్మ
రిపువనుల్ కాలిసిన పృథివియిద్ది:

గీ. సంస్కృతాంధ్రకవీంద్రులనరసకావ్య
వాహినులచేత గొన్నట్టివసుధ యిద్ది:
సకలకకుబంతరాళవిశ్రాంత మైన
మనతెలంగాణమహిమ సామాన్య మౌనె?



వర్రి త్యాగ ష

చ. పరిణతచిత్తముఁ గలిగి, పాపము లేనికృపారసంబునన్
బరఁగి, యమాయకత్వగుణపావను లై, పొరుగింటివారిమే
లరయుచు, నాత్మలో నతిథియుచ్చయె పెన్నిధిగాఁ దలంచున
చ్చరితుల నీసుపుత్రుల విశాలదృశాయతిఁ బ్రోవు మమ్మరో!

ఉ. రాజున కైనఁగాని కవిరాజునకుఁ బుధరాజుకున్ పరి
వ్రాజకరాజుకున్ జననిపాదసముచ్చన పూర్వజన్మవి
భ్రాజదనేకపుణ్యపరిపాకముచే లభియించుఁ గాదె! త
త్పూజ లొనర్చి సర్వజనపూజ్యుఁడ వై విలసిల్లు మాంధ్రుడా!

చ. కవికులకోకిలాళి సహకారము లేక కడిందిఁ గుంది మా
ధవసహకారముఁ గని కృతార్థతఁ గావ్యకుహూరుతంబులన్
జెవిచవిఁ గూర్చుచుండ బుధశేఖరులార తెలుంగుశారదన్
దవిలి భజింపుఁ డయ్య! ప్రమదంబునఁ గావ్యసుమవ్రజాంజలిన్,

శా. నిష్ణాతృత్వము శబ్దతంత్రమున నిర్ణిద్రప్రభావాతిరో
చిష్ణుత్వంబును గావ్యమార్గమున నిస్సీమంబుగాఁ గన్న భ్రా
జిష్ణుల్ పండితసత్కవుల్ గల సభాక్షేత్రంబులన్ గూర్చి వ
ర్ధిష్ణుల్ సోదరులార! మీరు దృఢభక్తిన్ గొల్వుఁడీ! శారదన్.

క. ఒకజాతి కొక్కనాయక,
యొకహృదయం, బొక్కపూన్కి, యొకవిద్యయె నీ
యకలంకకృపాదృష్టిని
సకలాశాయశముఁ గూర్చి సాఁకుము తల్లీ!

మ. జయముల్ గూర్చుచుఁ దెల్గుతల్లికి: మహోత్సాహంబుతో సోదరుల్
క్రియలెల్లన్ సమకూర్చుచున్; సుకవిరాట్కీర్తుల్ దిగంతంబులన్
"జయజై" యంచు నుతింపమన్ నియాంధ్రీ! సౌభ్రాత్రసంపన్నులై
ప్రియ మొప్పారఁగ నాంధ్రభూమికి నర్పింపన్ బ్రసూనాంజలుల్.

క. రాజోత్తములకు, సత్కవి
రాజోత్తములకును, విబుధరాజవరులకున్
భ్రాజితజననీభారతి
పూజకులకు నెల్ల నిండు పూజాకుసుమముల్.

గీ. అరవిందుతావకముగ నరసి మమ్ము
నాంధ్రసంస్కృతి జగమున నలముకొనుచు
మహితసంస్కృతులన్ దలమానికంబు
గాఁగ వెలిఁగెడునట్టులు గనుము తల్లి!

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

# సృష్టి

ఇది మహాంబుధి; ఇందులోపల
ఉదయమయ్యె; ఊర్మికలకహా
మొదలెఱుంగము; తుదియెఱుంగము
యెన్ని యుల్లోలంబులో
ఇక ముందుబుట్టె
నెట్టి కల్లోలంబులో ?

ఈ మహోర్మ్యం నెవడు లెక్కిడు
ఈ మహాంబుధి నెవ్వడీదును
యే మహాత్మ్యం డెఱుగ గలదిం
దే తుఫానులు బుట్టునో
మిన్నొఱయబొంగి
యేమిటిని పడగొట్టునో ?

ఏ సురాసుర రీయనంత మ
హా సముద్రము నాసపెంపున
యే సరణి మథియింతురో యిం
దేమి యమృతము బుట్టునో
ప్రళయంకరంబగు
నెట్టిగరళం బుట్టునో ?

ఇందు శుక్తిక లెన్నియున్నవో
ఇందు శైలము లెన్నియున్నవో
ఎందఱుద్ధతు లవిగ్రహింపగ
ఎంత యత్నము చేసిరో
ఫలమొందకుండా
ఎన్ని యేనుగు లాసిరో ?

ఎన్ని జంతువు లిందు బుట్టెనో
యెన్ని జీవము లంతరిల్లెనో
యెన్ని నౌకలు; ఎన్ని పడవలు
ఈ మహాంబుధి మునిగెనో
ఇంక ముందుముందూ
ఎన్ని మునుగ నున్నవో!

గార్లపాటి రామనర్సి

# సంక్రాంతి

చిరుతల కనువుగ చిందులు ద్రొక్కుచు
పాటలు పాడుచు పరుగులు పెడుతూ
దాసరివచ్చి ఛెంగున వ్రాలాడూ
వేసము చూడా వేగము రారండి !

భవునేత్ర విగతానల జ్వాలలు లా
క్రూరాహి ముఖగత జిహ్వాయిలా
భుగభుగ మండే భోగిమంటలివి
శుభముల గూర్పగ గొలుతము రారండి!

ప్రతిభలు పన్నిన పొడ్డవ్యూహంలా
పండుగ కన్నియ వపుర్లతలులా
వన్నెల వంపుల రంగవల్లులివి
కన్నుల పండువు నందగ రారండి !

వ్యూహములోపలి వీరశ్రేణులులా
కృతులలోపలి అక్షరపంక్తులులా
దారులుదీర్చిన గొబ్బి దేవర్లివి
భక్తితో కొలుతము బిరబిర రారండి!

పంటలొండొంటి పల్కరించు కో
వెంటనంటి నడయాడునట్లుగా
పరువముగూర్చే 'పాలవెల్లి' యిది
మురిపెముదీరా చూతము రారండి !

★ పిల్లలమఱ్ఱి

చిఱునవ్వు పాలబుగ్గలన్ బొరలాడ
నునుసిగ్గు కనుదోయి దోబూచులాడ
వన్నెపడతులా వెన్నెలవిరాల్
పున్నెము వచియూ పేరంటము రావంటి.

# శారద

ఆంధ్ర శారదనీకు అక్షరాంజలియా
అందమో ఆదమో రావమ్మ మాయమ్మ !

తరతరాల్ మాయింట తాండవించితి వంట
తలపు తరగలవెల్లి తళుకు వెలయించితల్లి !

తెలుగు నేలలపైన తేనె మాగాణి నీ
తీయగా తేపగా తీర్చి దిద్దిన తల్లి!

నవకవితా సుదతికి మధురగాన ఫణితులా
ముదముతో ముద్దుగా చదువ నేర్పినతల్లి !

ప్రబంధ సుందరీ రసబంధుర భంగిమయా
ప్రభలతో ప్రబలగా ప్రబోధించిన తల్లి !

నవకవితా యువతీ భావాభినయ గమన
శివములతో లీలలన్ హావణించిన తల్లి !

ప్రణయ రాగములోన ప్రణవ నాదమునింపి
ప్రవిమలయోగ నియతి ప్రసాదించెడి తల్లి ! ||ఆంధ్ర||

పిల్లలమఱ్ఱి హనుమంతరావు

— ప్రత్యూష

# అడుగుజాడలు

కాంచి కాంచిన కనులు
కనుమేర దాటంగ
కనుపాపలను దెప్ప
కబళించి వేసింది.
        కలయగానివిగాథయా
        చెలియరో
        కాలమ్ములో గల్సెనే.

లోకాల హింసల్లో
లొంగి లొంగిపోయి
ఆలోకనముకైన
ఆరాటపడ తుదికి
        అవియు కరవైపోయెనే
        సఖియరో
        ఆర్తి నేరికి దెల్పనే ?

సిగలో పూవెడి తేనే
సిటులొయ్యె మాపల్లె
నాకంట బడదున్న
నిలువదే నా లోకట
        అడుగుజాడలె మిగిలెనే
                నారాణీ !
        అడవిపాలిటకై పోయెనే.

అడ్లూరి అయోధ్యరామయ్య

# పువ్వా!

వాసంతవీధుల్లో వయ్యార మొలికించి
పైరగాలుల్లోన పారవశ్యముజేసి
వడగాడ్పులకు నీవు వాడిపొయ్యావా ?
పువ్వా ! వాడిపొయ్యావా ?

సూర్యుడే దండెత్తి చుట్టివేసేవేళ
ఆకాశమందుండి అగ్ని గురియుచునుండ
మండుటెండల కీవు మాడిపొయ్యావా ?
పువ్వా ! మాడిపొయ్యావా ?

కాళరాత్రుల్లోన కారుమబ్బులక్రింద
ఉఱుము మెరుములమధ్య ఉక్కిరిబిక్కిరై
ప్రళయవర్షానికే రాలిపొయ్యావా ?
పువ్వా ! రాలిపొయ్యావా ?

ప్రీతిమాలికవయ్యి నాతిచేతులగుండ
నాథుమెడలో వెలసి నాట్యాలు తెగజేసి
నవ్యజంటలమధ్య నలిగిపొయ్యావా
పువ్వా ! నలిగిపొయ్యావా ?

బలివెట్టగా నిన్ను బలవంతముగ కోసి
స్వార్థమానవులంత స్వామిపూజలు సేయ
దేహమే యర్పించి ధన్యవయ్యావా
పువ్వా ! ధన్యవయ్యావా ?

శవముమెడలో నీవు శిశువుచేతిలో నీవు
వధువుతలలో నీవు వరునిహృదిపై నీవు
పరుల కష్టసుఖాలు పంచుకొన్నావా ?
పువ్వా ! పంచుకొన్నావా ?

# చందమామ

ఎన్నాళ్లకొచ్చావు ఓ చందమామా
ఎక్కడా దాగావు నా చిన్నిమామా !

చీకట్లు నినుజూచి సిగ్గుజెందాయి
చక్ర వాకాలన్ని చెలరేగినాయి.

నల్ల కలువలపూలు కళ్హార వికసించె
మల్లె 'రాతిరి రాణి' పరిమళం ప్రసరించె

అద్దంలో మా చిట్టి ఆడుకొను నీతో
ముద్దుగా పల్కును ముచ్చట్లు నీతో

నీ ఇల్లు వాకిలీ ఎక్కడున్నాదీ
నీ తల్లిదండ్రెవరు చెప్పవే మామా ?

పిల్ల తల్లులు నిన్ను పిల్చినా ఎప్పుడూ
పారిపోతుంటావు నా దొంగమామా !!

మూటుపురి వెంకటేశ్వరరావు

# గౌరి

పున్నెములందు సద్రచనబొందిన యీ పరమ వ్రతంబులో
బన్నిన కంకణమ్ము కర పంకజమందలరార భక్తి సం
పన్నత నారితేరిన యుమాసమలన్ పదమంటి మ్రొక్కన
య్యన్నులమిన్న లాడెడు ప్రియంబులు చెల్లియ నిన్నునోముతన్.

ఎవ్వరు నేర్పిరే చెలియ యీ గతి వాయనమిచ్చి పల్కనీ
నవ్విన నవ్వులో తెనుగు నాటి మనోహరకీర్తి వల్లికల్
పువ్వులు పూచెనమ్మ నరపుంగవుడౌ పతి నెమ్మనంబులో
గ్రువ్విన భావముల్ వెలికి గూర్చినవే నునుసిగ్గు దొంతరల్;

కొసల మరల్చివేసినది క్రొమ్ముడి నూతన ధూప సౌరభ
ప్రసర సువాసితమ్మునయి వ్రాలెను వెన్నుననంటి దీక్షమై
ప్రసవచయమ్మునందు పరిభాగమునందెటు నిల్పితమ్మ! యీ
పస విదులించుకొన్న పతిభాగ్యము నేమని ప్రస్తుతించెదన్.

ఆచారమ్ము లలంకృతమ్ములు; స్తుతివ్యాపారముల్ నేటివా
ప్రాచీనంబులు నిండికొన్నవి సమారబ్ధ వ్రతంబందు నో
హో చైతన్య కళాస్వరూపిణీ! త్రిలింగోర్వీ సుమారామముల్
బూచెన్‌గా మధురాననేందు మధు సంపూర్ణ ప్రవాహంబునన్.

సోమరాజు ఇందుమతీదేవి

---

# హితోక్తి

పువ్వులపైని నిప్పులను బోయుటకేనియు. మల్లెతీవకు౯
గ్రొవ్విన కాఱుదున్న జతగూర్చుటకేనియు గున్నమావులన్
మవ్వము దూలిపో సెగల మాడ్చుటకేనియు సాహసించి యీ
పువ్వులతోటనే నఱుకఁబూనిరి కొందఱు మూఢ మానవుల్.

ఒక సీతమ్మను దాకు పాపము జటాయుక్రోధమై, వానర
ప్రకరంబై హనుమన్నిదాఘ దహనజ్వాలాళియై, రాము సా
యకమై కూల్చె సమూలఘాతముగ దేవారాతిఁ బౌలస్త్యునే
డొకటీ రెండునుగావు స్త్రీలకగు నాయుర్మానభంగ క్రియల్.

పాలబుగ్గల శిశువ్రాతంబు మంటల
బడి 'చుంయి' మనికాలు నెడరుపాటు,
కాళ్ళపారాణి బుగ్గల కాటుకయు మాయ
నవదంపతులు కత్తి నఱుకబడుట,
పూచిన తీవియబోలు ముత్తయిదువ౯
సిగబట్టి యీడ్చు దుండగులదాడి,
కాటికి కాల్సాచి కదలని ముదివగ్గు
మంట మూటగవైవ మడిసిచనుట,

యనెడి ఘోరాతిఘోర కృత్యంబులెల్ల
ప్రజల స్వాతంత్ర్యలాభ సంపదనెపాన
న్యాయమెల్లని మతమహోన్మాదచిత్తు
లేకధాటిగ సలిపినవేగదయ్య !

నవఖాళీ రుధిరస్రవంతులకుఁ జింతన్ మ్రగ్గి, పంజాబు ఘో
ర విపత్తుల్ భరియింపలేక, వివిధప్రాంతోగ్ర సంఘర్షణల్
చెవులన్ జీములుగట్ట, దుండగులకాశ్మీరోగ్రధాటిన్ పరా
భవశంకన్ బడు భారతావనిఁ దలంపన్ గుండె నీరయ్యెడిన్.

ఎన్నోఘోరము లెన్నొకష్టములతో నీనాడు స్వాతంత్ర్య సం
పన్నంబైనది భారతంబు; మరలన్ బ్రత్యగ్ర సిద్ధాంతముల్,
సన్నాహంబులు, భావభేదములు, స్వేచ్ఛావృత్తు, లుద్రేకముల్
పన్నాగంబులురేపి శాంతిసుఖముల్ భంజింపకోయీ! సఖా!

నాగలితోడిదే జగమనం గృషిసల్పెడు రైతుబిడ్డలున్
భోగములెట్టివో ! మధురభోజనమెట్టిదొ ! కానరున్న యా
త్యాగులు కార్మికుల్ చెడుగుదారులబట్టి నశించిపోవ నే
వో! గుడిపూడిజంగముల యూహలుపన్నకుమోయి! మిత్రమా!

కేశవపంతుల నరసింహశాస్త్రి

# తెనుగు తల్లి

సీ. పరిపూర్ణ పావనాంభ స్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు;
ఆలంపురీ నందనారామ విభ్రాజి
మల్లోబఫలరాజ మధురరుచికి;
ఆంధ్రీ కుమారీ సమాయుక్త పరిపూత
తుంగా పయస్సు మాధుర్య మునకు ;
ఖండశర్కర, జాతి, ఖర్జూర, గోక్షీర,
ద్రాక్షాదియుత రామరస మునకును;

అమృత నిష్యందివల్లకీ హ్లాదమునకు;
రాగిణీ దివ్యసమ్మోహ రాగమునకు ;
తేనెతేటల నవకంపు సోనలకును ;
సాటియగును మాతెనుగు భాషామతల్లి.

# మిత్రుడా!

కొండవీటిని కోటలమరిచి
దండిపీరులు తాండవింపగ
చండవీర్యము నిండియుంచిన
తెనుగుభూమిది మిత్రుడా !

శాయనార్యుని సాకిపెంచిన
ధీయుతుండగు తిమ్మరుసుపును
బాయకుండగ ప్రబలజేసిన
తెనుగుభూమిది మిత్రుడా !

నవరసమ్ముల నాదమొప్పగ
చెవులుసోకగ కవనమల్లిన
కవులుముగ్గురు కల్గియుండిన
తెనుగుభూమిది మిత్రుడా !

వేమనార్య వివేకమహిమను
సోమనాథుని సూక్తియుక్తిని
రామలింగని రమ్యచరితను
గన్నభూమిది మిత్రుడా !

దత్తమండలి ధైర్యపటిమయు
నుత్తరాంధ్రుల యుచితచర్యలు
నుత్తమంబుగ నొప్పియుండెడు
తెనుగుభూమిది మిత్రుడా !

ఆయుధంబుల ఛాయబెరిగిన
కాయబలమున గడలుగెలిచిన
వేయివిధముల పేరుబొందిన
యాంధ్రయోధుల బొగడుమా !

తేటమాటల తేనెలొలుకుచు
పాటవంబున బరుషమొప్పుచు
సాటిదాసల నీటుమీరెడు
నాంధ్రభాషను బొగడుమా.

సురవరము ప్రతాపరెడ్డి

# తెనుగుతోట

తెలుగు తోటలలోన - తెలుగు వన్నెలు లేవు
శోభనిచ్చే దెన్నడో ?
తోటంత
సొగసు గులికే దెన్నడో ?

అల్లు పందిరిలోన - ఆటలాడెడు తీవె
పడగ లెత్తే దెన్నడో ?
తోటంత
పైకి ప్రాకే దెన్నడో ?

అందాలు జిలుకుచు - ఆకుమరుగున జేరి
మొగ్గ లొడిగే దెన్నడో ?
తోటంత
సిగ్గు జిలుకే దెన్నడో ?

పసరు తీవెలలోన - పసిడి పిందెలుపడి
పండ్లు పండే దెన్నడో ?
తోటంత
పరువు కాచ్చే దెన్నడో ?

గాలి తాకుడులకు - కదలి ఉయ్యాలలూగి
జోల బాడే దెన్నడో ?
తోటంత
సొంపు లొలికే దెన్నడో ?

# ఆంధ్రభారతి

సీ. పట్టాసనుండు వాగ్దేవిమంత్రము పఠించి
నిన్ను ప్రతిష్ఠించె నిజమతివేళ
ఆవాహనంబౌట నర్ఘ్యపాద్యములిచ్చి
తిక్కన కవివంతు దీర్చుకొనియె
కనకాభిషేకభాగ్యముఁ బొందగల్గితి
కవిసార్వభౌము సాంగత్యగరిమ
వగు నలంక్రియల దిగ్దంతి యూథముదన్నె
అవధానులెల్ల మాపాదులౌసగ

గీ. నవ్యసాహిత్యకవు లప్పనలనుదన్న
కోకిలలు మంత్రపుష్పముల్ గురియుచుండ
పాటి రాష్ట్రాలు మంగళాక్షతలుజల్ల
నంది భాషావధూటి యంజలి ఘటించు:

సుఖంబెదజల్లు ఓష్ఠప్రసూనకలిక
శ్రుతులు వెలయించు వీణావిశుద్ధహస్త
సుమములను వంచిపెట్టు మంజుల లతాంగి
ఆంధ్రభారతి! సతము నిన్నాశ్రయింతు.

పుర్స్పుటూరు రాఘవాచార్యులు

# ఎందులకో

నందన వీధికలందు
చందన వాయువులందు
నందించును; నవసౌరభ
మందించును; ఎవ్వరికో?
ఎవ్వరికో? ఎందులకో?
ఎందులకో నా హృదయం?

వెన్నెల క్రొన్నెల యగుచు
వన్నని కిన్నెర యగుచు
చిలికించును సుధానిధిని;
పలికించును నభో ఘనిని;
ఎవ్వరికై? ఎందులకై?
ఎందులకో నా హృదయం?

భ్రమరీ వ్యాధూత సుమిత
రమణీయ నికుంజ శోభ
గమనించుచు గమనించుచు
గమకించును విషాద గీతి;
ప్రవహించును బాష్పరీతి;
ఏ యెడకో? ఏ కడకో?
ఎందులకో నా హృదయం?



63

ఏ తరుణీ దరహాసం
ఏ సుమనస్సు వికాసం
ఒరికిన వలపులతోనే
మసిపట్టిన ఆశయాల నేల
ఊస ఊస లాడించు?

# మధుర పథము

కన్నులం మోడ్చి కమ్మని కంఠమెత్తి
సుందరోహారం వితానంప గగన
భూనభములలోన మోహన గానమును
ఆలపింపవమ్మ. నాయందు నీవొ
ఏదొ నీయందు లీనమై ఏకరీతి:

ఏమి తపమాచరించితినో మనోహ
రాంగి! భవదీయ కలపరిష్వంగమునకు
మారిపోవుదు,నను నేనె మరచి నీదు
లలిత పరివాది నీ సుధామల తరంగ
ఝుమంలోని తుషారమంజరులలోన
తేలిపోవుచు తన్మయ దీపములకు,

వ్రాలుచుంతట నీ కపోలాలపైన
ముద్దులొలికెడి చిరునవ్వ మొగ్గనగుచు;
పొందవింతును నీ యురస్థలమునందు
వాడి వెదజల్లు విరజాజి దండనగుచు;

నూత్నసంఫుల్ల మన్మనోంబుజదళాన్త
రములనానందమధుర మరందమీవు
మాధురీభావ సురభి సంపదవు నీవు;
స్వాంతమేనీవు జీవిత స్వాదుసరసి
కలసుధాపూర మీవు నా గానమీవు.

నీదు కడగంటిచూపు వెన్నెలలతోడ
ఈయమేయప్రసన్న విహాయసంపు
సరళ వీథులలో మనశ్చంద్రు డిటులె
పెరిగిపోనిమ్ము చిన్ముద్ర కరజీనింక
రథమునడిపించు ఆక్షీర పథములందు.

# స్వప్న సుందరి

కాటుకనీలిరేకల నిగారపుకాన్గిలను చూపుతోడ స
య్యాటలనాడు లేనగవుటందపుమోకల నేలనాహృదిన్
మీటెదు చిన్నికిన్నెరను మీటినరీతి మనోహరీ ? ఎదో
దాటిననాటి స్వాప్నిక కథాగతులన్ బలికింపబోకుమా !

కన్నులుమూసిలోనగనగా కనుపించు స్మితించు నీదు దీ
వ్యన్నవమూర్తి నాహృదయ పద్మమునన్ వరపద్మయై, రసా
భ్యున్నత భావడోలికల నూగుచునూగుచు దేలిపోవ. నా
కన్నులు విచ్చుహెచ్చు తమకంబున అశ్రులురాలుజాలుగా.

వ॥ త్యాగ వ.

సీ॥ భార్గవ .............................................. ★

ఊరింపుమేరదోచియును తోచనిఆయుచలాగ్రమందు. పుం
దారపుతోటవాకిట సదా ప్రవహించు ఝరీమృదూర్మి మా
లారవమేళితస్వర కరస్థవినోద విపంచివై, లయ
స్ఫారమనోజ్ఞగీతికలు పాడెదవే ఎదవేగిపోవగన్.

ఆడెదవొక్కసారి నభమందున జక్కదనాలచుక్కవై
పాడెదవేదియో హృదయభారముడిగ్గ అమర్త్యకన్యలన్
గూడిచరింతునందనము కోనలబూవుల సోనలందు దూ
గాడుచు నింపుకొందువు మనంబునమోవ నిలింపసంపదన్.

తొలిరేవెన్నెల పాలకోనేరున ము
ద్దుల్మీర నీ వేసునున్
జలకంబాడిననాటిమై పులక లిం
కన్దోచు క్రొంగ్రొత్తలై.
తొలగంబోవదు ఆరమాప్రతిమ క
న్నోయిన్ దిగన్జారు కా
ల్వలలోనన్ బ్రతిబింబితంబు నగుచున్
లాలించెడిన్ డెందమున్.

కలయైపోయిననాటి జీవితసుధా
కాంక్ష ప్రపంచంబు నం
దలి యందాల గులాబిపూబొదలు, మం
దానంవ వాయూర్మికల్,

ప్రత్యూష ..............................................

వలపుంగావి పసందు సంజలును, లీ
లావేశ సంరావముల్
తలపోయన్ ఒకచిత్ర చిత్రితమునై
తాకున్ మనోదృష్టికిన్.

వినవచ్చున్ మృదురీతి నిర్ఝరవనీ
విద్యాధరీ కిన్నరా
క్వణనంబుల్, కనవచ్చు త్రుళ్ళిపడు గం
గారంగదూర్మి ప్రభే
లన హేలానవడోలలన్ గదలు చం
ద్రస్మేర మందారముల్
కనులన్ మూసిగతాను భూతుల సమీ
క్షల్ సేయనొక్కొక్కచో.

కాటుకచీకటిం బొగలు
గ్రక్కుఘనాఘన పంక్తులందు నీ
వేటికి దూరినావు - తపి
యింతువు - తీరని విప్రయోగ దుః
ఖాటవులందు గ్రుందు హృద
యంబువలెన్ - శమియింపమేని ఆ
రాటమునాదు బాష్పఝరు
లన్ జలకంబులు ఆడిపోగదే.

సిరిప్రగడ భార్గవరావు

ప్రత్యూష

# నిరాక

నీవురావాలన్న మమతే
నీవువస్తావన్న మురుపై
బ్రతుకు కిన్నెరభావ మూర్ఛన
లోలికి పోయినదీ.

నీవువస్తావన్న మురుపున
నీవెవరవో పోల్చుకుంటూ
జీవతూలిక తీవవెన్నెల
సొంపు లొంపినదీ.

నీవురావాలన్న వలపే
తలపుతేనియ భరముమోస్తూ
విరహగేయ దివ్యప్రసూనా
ఎళుల సల్లినదీ.

నీవెవచ్చేవన్న మురుపున
బ్రతుకుతమ్మునియాసముత్తైము
లోలికి నిలువున నులుకుతూ న
ర్తిల్లి పోయినవీ.

పత్యూష ————— ఓరా

ఊరికావలి మావి తోపున
దారిగాచిన పిల్లకోయిల
నిన్నుపోల్చుక "మేలుకో"మ్మని
యీల వేసినదీ;

వీధి పందిట కన్నె మల్లియ
"వచ్చెలే !
పంటయ పండె లె!"మ్మని చిరుపాటున
కన్ను గిలికినదీ;

సందడిలో సంపడిగ యౌవన
మాడుచూ పాడుచు ముగ్ధ —
ప్రణయి నూరార్చుచూ మోవిని
అంటిపోయినదీ.

... ... ...

రాకలో రంగిలిన నే నీ
రాకలోనే మైమరుస్తే
సేకరించిన సొంపు సంపద
నీ కౌనర్చె దెవ్వరో !!

జమ్మలమడక సూర్య ప్రకాశరావు

# మాయ

ఇదియేమొ యెవరైన నెరుగంగజేయరా ?
ఇటులున్న నా బాధ నెటులైన బాపరా ?

దీని నీడలు నిండు దిశదిశాంతములందు
అన్ని యెల్లలుదాటి యంతటన్ బ్రసరించు;
ఆ నీడ ఛాయలన్ విశ్వమంతయుగూడ
ఒకరీతి మదితోచు నొకరీతి కనుపించు ||ఇది||

కానన్నవాటిని అద్దికాదని చెప్పు
కాదన్నవాటని కనుపింపజేయును;
ఒకసారి నొకదాని నొకరీతి జూపించు
మరుసారి దానినే మార్చి జూపించును ||ఇది||

కనుల గ్రమ్మినవేమొ కారుచీకటులల్ల
కనుపింపదేమియు, కనలేను నిజమును;
ఏమున్నదీ వెనుక నేమున్నదోయీ ?
తెలియజాలక నేను విలపించుచుంటి.

ఇదియేమొ యెవరైన నెరుగంగజేయరా ?
ఇటులున్న నా బాధ నెటులైన బాపరా ?

సన్నిధానం శ్రీధరశర్మ

# ఆయాది

ఆయాది నాకిపుడు హాలాహలంబయ్యె
లోకమే చీకటిలొ లోపించె నాకు
శోకమే నలుదిశల శ్రుతియించెనాకు!

నన్ను నే చూసుకొని నిన్నే తలచుకొని
నిన్ను చూసినచాలు అన్నీ మరచిపోయి
నీవు నాతో వుంటె బాపురేపోయియాది ||ఆ||

వసవాహినులుపారు గుసగుసల యాది
కొసరి కొసరీ నవ్వు విసరు పువ్వుల యాది
రాగనిభృతమైన త్యాగాల యాది ||ఆ||

వాల్చూపు జాలులో పోల్చుకోలేనట్టి
కన్గోన లంమూరు కమ్మనీ మధువులు
కాలాహి విషయమునే కరగించు యాది ||ఆ||

మల్లెపందిరిక్రింద నీవల్లి వేసిన ప్రేమ
పిల్లకాల్వల కెలన నే కొల్లగొట్టిన ప్రేమ
దేవాలయంబులో దీక్షబూనిన యాది ||ఆ||

అద్దములొ మన ప్రతిమ లాడుకొను యాది
నిద్దురోయినగాని వద్దన్నగాని
ముద్దులొలికిన ప్రేమ యుద్ధాల యాది ||ఆ||

ఆయాది నాకిపుడు హాలాహలంబయ్యె
లోకమే చీకటిలొ లోపించె నాకు
శోకమే నలుదిశల శ్రుతియించెనాకు!

బూర్గుల రంగనాథరావు

# భానురథము

ఉదయంబందుము భాస్కరా! కరసహస్రోన్మేషముప్పొంగ నీ
సదయాకారము గాంచు వేడ్క సరసీజాతంబులున్ మానవుల్
నదులుం బర్వతముల్ నభంబు భువియున్ నానా మహాజీవులున్
ఎదురుంజూపుల జూచుచుండ్రు, ప్రభురాకన్ వేచు సభ్యుల్ బలెన్.

కాలుడు మాయయందు సుభగత్వతనొందెడు సారె సంపతుల్
మూలములేని యాకసపుమ్రోలల మగ్గముపైచి చిత్రమౌ
కాలపు తెల్లతాను కడకమ్ములు లేకయన్నేయనేయమే
మోరిని దానిగొల్చిరాన నొప్పును సూర్యుడు మూరబద్ధమై!

ముసలి యెద్దుసులేపి వెనసాగ సవరించి
కట్టుపై చేయిడి కర్షకుండు ;
పెంటితో ప్రియమాడి పిల్లలముద్దాడి
మేతల కరుగంగ పోతుపక్షి ;
'ఇంతమే ప్రాప్తిబోలి నాటి' కంచును
తడబడి పరువెత్తు తస్కరుండు ;
ఉప్పాంత మంత్రంబు సుచ్చరించుచు
నర్ఘ్య మర్పింప నిల్చిన యాహితాగ్ని ;

ప్రియుని కౌగిలివిడలేక బిడియపడుచు
నత్తవారింట మెలగెడి క్రొత్తపడుచు

ఆలకింతురు చెవియొగ్గ యలతియలతి
బంధురధ్యానమున వచ్చు భానురథము.

స్వామి! పల్వురు శిష్యవర్గముల కాచార్యుండవై నీవు ఘం
టో ఘోమాంసలు సల్పుచుండువటగా ఓంకారముల్ సల్పి వా
రే మోహించు ధరిత్రను విద్యలను నేడీ ప్రాక్తనాచారముల్
సామర్థ్యంబులు సున్న, బాహ్యములై శాస్త్రంబులుం జెల్లెడిన్॥

ఆముదమా ఖరీదు; చమురా చమురాయెను; సీమనూనియల్
ధామల ప్రౌఢ్యమంటలకు పట్టెడునంతయు లేవు, వస్త్రాలుం
దాముసు చప్పచల్లవడె దారువరిత్రత జెంది, వైద్యుతం
బాముసు పంతపోతవడె నక్కట దీపము లోపమయ్యెనే!

లో వెలుగెన్నడో మనుజలోపపు టంచుల లుప్తమయ్యె, పై
పై వెలుగైన చీకటుల బంధురతాండవ మొగ్గడించు నం
దీవరి కూరడిల్ల గలయించెను గొంతెమ కోర్కెలై, మను
ష్యావళి బాహిరంబునను అంతరమందున గ్రుడ్డియాయనే?

మానవు దర్థనిర్మితిని ప్రమాన్పడజేయును విశ్వకర్మనిన్
హీనుత సంపదం గెలుచు దేవ పురోహితుగూడనైన నా
పానుగుడైనయట్లు కలియంతయు నేలకు వమ్ముసేసి తా
దీనత నాకటంబడునె, దీపముకైనను నోచుకోకయో?

 ప్రత్యూష

అదుగో వార్ధస్త్రీ కుటీరమున
    భవ్యంబైన తేజంబు; ఆ
య్యది కార్చిచ్చునుకాదు,
    మందకాంతి చంద్రాంశు [illegible], కా
ల్వాదుముట్టంజన,
    జ్ఞానతీక్ష్ణమగు నాప్పంజూమనా దివ్వియజ్ఞ,
పదివేల్ హస్తములారునే
    [illegible] దీపావళుల్?

నాకేకావలె, నేనవేలుదను పంతంబుల్
    వృథాలాపముల్;
నాకింతైనసుజాబు,
    నామిగులుబరో నా సోదరా నీవునా
స్వీకారంబుబు సల్పవయ్యా;
    ఘనమా జీవంబు స్వార్థంబుకై
భూకల్యాణములొక్కచేత నగునే
    పొందైన మేల్కాదొకో?

ఖండవల్లి లక్ష్మీరంజనం

# పిల్లలమండీ పిల్లలమూ !

పిల్లలమండీ—
పిల్లలమూ !
తలంపు నిచ్చెన
త [illegible] 
ఎక్కెదమూ !—పై
కెక్కెదమూ !
ఆకాశంతో
మ[illegible]ము వేసి
చందమామతో
పందెము వేసీ
నవ్వెదమూ !
నవ్వించెదమూ !
—పిల్లలమండీ, పిల్లలమూ !

తారకలతో
తారంగం
మెరుగువాలతో
పరుగుడు పందెం

గడగడ ఉరుముతో
గుడుగుడు గుంచెం
తెప్పలమాటున
[illegible]
ఆడెదమూ ;
ఓడించెదమూ !
—పిల్లలమండీ, పిల్లలమూ !

ఇంద్రధనువుతో
వుంగిడిపూసీ
మంచు ముత్తెముల
సంపుల నింపుతు
వానచేరులను
పట్టుక కిందికి
పాకెదమూ !
పాకించెదమూ !
—పిల్లలమండీ, పిల్లలమూ ! !

# మా ప్రణయం !

పెరిగిపోయిన

పూసలపేరూ

చితికిపోయిన

గాజుల జోడూ

చినిగిపోయిన

చీరలకొంగూ

మా ప్రణయం రా

మా ప్రణయం !

... ... ...

వాడిపోయిన

పూవుల దండ

పొంగిపోయిన

పాల మీగడ

కవ్వమాడిన

చల్లపేరుపూ

మా ప్రణయంరా

మా ప్రణయం !

... ... ...

ఆగిపోయిన
కట్టుకాలువ
నిలిచిపోయిన
మడుగులనీరు
ఆకులు రాలిన
తీగలతీరు
మా ప్రణయం రా
మా ప్రణయం!

... ... ....

వెలిగిపోయిన
వెచ్చనికొాడలు
లేచిపోయిన
ఆవిరితెప్ప
మా ప్రణయం రా
మా ప్రణయం!!



77

# ముల్లు

తన్మయతా మరచింది
దారియే తప్పింది;
నా చూపులో చూపు
నాటుటకు చూచింది;

ముల్లుపై అరికాలు
మోపింది మైమరచి
"అల్లామరీ" అంటు
మెల్లగా అరిచింది;

అలికిడికి నే జూడ
"హాయ్ అల్లా" అంటు
చెట్టుచాటున ఒదిగి
యిట్టె బురఖాగుంజి,

'మెహంది' రాచినకాలు
ముందునకు చాచింది;
ముల్లు తీసితినేను,
ముల్లుగుచ్చె హసీన
... ... ...
కంటితో హృదయాన
కానరాకుండా!
తీసివేతామన్న
తీయరాకుండా !!

పరితోష ———— ౭౭

# వేయి స్తంభాల గుడి

వేయేసి భావాలు
        వెల్లువలై పార
వేయి కండ్లున్నట్లు
        వెతికికొంచూ నేను
వేయి కాళ్లున్నట్లు
        వేవేగ పరుగిడుచు
వేయి స్తంభాల గుడికినే
        వెళ్ళి వచ్చితిని !

...        ...        ...

ఆనాటి నా స్థాన
        మాత్మలో దలపోయ,
శిల్ప సౌందర్యాలు
        చిత్రితములైనట్టి
ముద్దు బొమ్మలలోన
        మూర్తీభవించిన
ఆంధ్ర ప్రశస్తి నా
        కవగాహనం బయ్యె!
స్తంభములో నిలిపిన
        నీరి ఫలకములోన

ఆనాటి నా రూప
లావణ్యముల ఛాయ
ఆ నీలి మెరుగులో
తెలుగు వెలుగుల జాడ
అందులో నా నీడ
వెదకుకొను చుంటీ!
పిచ్చినై నన్ను నే
మెచ్చుకొనుచుంటీ!!
నేను పేర్చిన గోడ
నేను కట్టినమేడ
నేను పూసినపూత
నేను రాసినరాత
నేను తీర్చిన రేఖ
నేను చెక్కినబొమ్మ
మెరసి పోయిననాటి
నానొసటి గీతనే
కొలుచుకొని నన్నునే
వలచు కొనుచుంటీ!!

వెల్దుర్తి మాణిక్యరావు

# సంక్రాంతి

చిగురు చెక్కిళ్ల ముంగురుల్చిక్కువడగ
మొల్లచిఱు నవ్వుమోమున మొగ్గదొడుగ
అగరు తిలకంబు బొమ్మల నందగింప
చిలుక పల్కులు పలికెను చిన్నిచెల్లె,

"అన్న యెక్కడి కేగెదు? నన్నుజూడ
సకియ సంక్రాంతి వచ్చెడు సమయమయ్యె;
క్రొత్త బొమ్మలు నీవివ్వు దెత్తువేని
ఇచ్చెదను నీకు ముద్దుల నెన్నియైన"

... ... ...

బాల సంక్రాంతి తోడుత మేలమాడి
వత్సరంబయ్యె; నెచ్చెలి వచ్చునంట
'ఎప్పుడో యెప్పుడో,' యని యెదురు చూచు
ఈడు కన్నియలం గూడి యాడుకొనగ,

... ... ...

కుంకుమంబులు చల్లిగొబ్బి ముద్దలువెట్ట
పగడాల సొగసును పరిహసింప
పక్షివ్రాలిన భంగి పసుపు ముగ్గులు దీర్ప
పుష్య రాగంబుల పొలుపు మీర

రంగార దీర్చిన రంగవల్లిక గుంపు
కన్నె తీగల వోలె వన్నెగుల్క
జడలోని మల్లెలు జారియుండిన చోటు
ముత్యాల సొగసుతో ముచ్చటాడ

చీర కుచ్చిళ్ళు పదముల చిందులాడ
తెనుగు వాకింట్ల దిరిగెడు తీగబోండ్లు
సరస సల్లాపములు సేయు సమయమందు
పుట్టి నింటికి వచ్చెను పుష్యలక్ష్మి.

కాళ్ళకడియాలు కరముల కంకణాలు
మధుర మధుర స్వనంబుల మాటలాడ
ఆంధ్ర గృహముల గారాపు టాడుబిడ్డ
వనిత సంక్రాంతి యల్లన వచ్చునపుడు.

గంప నెత్తినబెట్టి సొంపుగా జూచుచు
జొన్న చేనున కేగు వన్నెలాడి
కొడవలి చేబూని కులుకుచు గుయికుచు
కాశె గడ్డిని గోయు కాపుకన్నె
పసుపు చీరనుదాల్చి బంతి పూవులమాల
లందంబుగా గ్రుచ్చు సుందరాంగి
కమ్మ సంపగితోట చెమ్మ చెక్కులనాడు
చిన్నారి పొన్నారి చెలుల గుంపు

ఎదురుగానేగి "ముద్దుల వదినె రావె
మేన గోడంద్రు నినుజూడ మిరపతోడ
పొంతకనుపండు వొనరించు పొగడ చెట్ల
విరులు గ్రహియించి తెచ్చెదు వేళయయ్యె"

అనుచు నాహ్వాన మొనరించు నవసరాన
"ఎవరు బిల్చిరె చెల్లెల యెందు కింత
సంబరముజూపు సంక్రాంతి సకియ" యనుచు
తియ్య తీయగ బలికెడు తొయ్యలులును;

"ఎన్నిదిన ములకే తల్లి! నిన్నుజూడ
కనులు వాచెను ర"మ్మంచు కౌగలించి
మధుర ప్రియవాక్యముల నాదిమాన పడుచు;
"తరుణ వతియైన మాచిల్క తల్లికిపుడు
పసుపు గుంకుమలంబెట్టి పంపవలయు"
ననుచు వచియించు నాప్తులు నప్తలపుసుంత

— — —

ఇల్లువెనకనె విలసిల్లు మల్లెతోట
విరియ బూచిన పూలతో వేడ్కసేయ
బీరపాదుల కొక్కింత పూపసందు
కొమ్మ చిక్కుడు పందిలి స్గూరుచుండి
జారుజడ నల్లుకొనుచున్న వారిజాక్షి
లలిత సుకుమారహృదయాన మొలకలెత్తు

తీయతలపుల మనకెట్లు తెలియు గాని
నాతి పెదవుల చిఱునవ్వు నాట్యమాడు
పండుగకు దెచ్చుకొన్నట్టి బెండపూవు
వన్నెచీరను ధరియించి వచ్చుపడతి,
నాగలిని దున్నుచుండిన నాథుకడకు
సద్దిగొను పోవునొక కాపు ముద్దులాడి,

నడుము కొడ్డాణ మొక వింతకడిమి గూర్ప
నిలువు టద్దంబు కెదురుగా నెలతయోర్తు
సగుమొగమ్మున కుంకుమ నద్దుకొనుచు
నోర చూపుల జూచు నొయ్యారమౌర !

వంగతోటకు వలపట వనితయోర్తు
దోసతీవల పండ్లను గోసికొనుచు
యేల పాటలు బాడెడు యింపు జూచి
రసిక హృదయాలు సౌందర్య రాజ్యమేలు.

పశుల మందనుగాచెడు బాలుడొకడు
చింతకాయను గోయగా చెట్టునెక్క
కోడెలొకకొన్ని వెంటరా గోగణంబు
జలక మాడగనేగును చెఱువు కడకు;

చిన్నిలేగల యొడల్ చన్నుజేపగ నాకు
చొక్కింపు టావుల చక్కదనము

పచ్చని పచ్చిక పట్టులఁ బవళించు
ప్రాయంపు పెద్దుల సోయగంబు
రంకెలు పైచుచు రంపిల్లి పోరాడు
కొమ్ముల కోడెల గ్రుమ్ములాట
ఆకుల గుడిసెకు అతి సమీపంబున
లీలగా విహరించు లేగసొరు

అరసి తనకష్ట సుఖముల మరచిపోయి
కందిచేనున నిల్చున్న కాపువాని
కోరమీసాల కొనలందు కోడెవయసు
ముద్దుపడుచుల హృదయముల్ మోహ పెట్టు,

సగము నలిగిన పూవులు సిగనుగుల్క
రణిత కంకణ కింకిణీ రవముతోడ
చల్లజేయుచు నుండెడు గొల్ల పడుచు,
పిన్న తమ్ముడు తొట్టెలో ప్రీతితోడ
ఆడుకొనుచుండ నయిదేండ్ల అక్కయొర్తు
ఉయ్యేలను సూగు చుండెడు యొప్పుజూచి
మంద హాసంబు జేసెడు మాతృదేవి,
కమల కావాస యోగ్యమౌ కనులనుండి
దివ్యవిజ్ఞాన లతికలు తీగెవార
పురుష సూక్తము పఠియించు భూసురుండు,
మకర లక్ష్మికి నెయ్యంపు సకులుగారె?

రా - - - - - - - ప్రత్యూష

అంప శయ్యను కొన్నాళ్లు అధివసించి
కన్నులారగ నొకమారు గాంచి నిన్ను
ప్రాణములు వీడదలచె మా బ్రహ్మచారి
ఎంత [illegible]యవె చెల్లెలా యింతులందు!

# పూలచెట్లు

చిన్ని బంగారు చేతుల చెంబునెత్తి
ప్రొద్దుపొడుపుతో జనుదెంచి పూలచెట్ల
కిట్లు నీర్వోసి శ్రమియించె దీవుతల్లి
ఎన్ని జన్మాల బంధమో యెవరి కెరుక?

చెట్లమీదనె యుండు నీచిత్త మెపుడు
పూలువాడక ఆకులు రాలకుండ
వరము గోరగమొన్న నీ వరిగితంట
శ్యామలాదేవి ఆలయ సముఖ మునకు!

పలిరు బిడ్డల గాంచిన తల్లికట్లు
ప్రాణములు వేచివచ్చును బాలనీకు;
ముందు పిల్లలతల్లివై మురియు నపుడు
ఎంత ప్రేమించి పోషింతు వేమొవారి!

అన్నమును పెట్టెదంచును అమ్మనిన్ను
పిలిచె ఆకలి వేళయు తెలియ వయితి;
పరహితంబున తన్ను దామరచు టరయ
వెన్నతో నీకుబెట్టిన విద్యయేమొ !

"ఏమొవచియించు చుంటివి యింతసేపు
చాలునిక నీదువాక్యలు చాలు"ననుచు
కిలకిల నునవ్వ దానిమ్మ గింజలచట
రాలెనను భ్రాంతి ఆచిల్క వ్రాలెనేమొ!

దేవులపల్లి రామానుజరావు

# 'నేను'

వీలున్న ప్రతిచోట విర్రవీగుచు అపర
హిట్లరౌతాను నే - హిట్లరౌతాను;
తలదన్ను వానికడ - తలవంచి 'దయ' అనుచు
గాంధి నౌతాను నే - గాంధినౌతాను.

మంది తప్పులనేరి - మనసు ఖాతా నింపి
వడ్డి వడ్డీకట్టి - వల్లించుతాను
నాతప్పులను దాచ- నానారకాలైన
ధర్మసూత్రాలతో - దడికట్టుతాను !

# హృదయావేదన

అవనిపై జరిగేటి
అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని
ఇన్ని ఆవేదనలు ?

తప్పు దిద్దగ లేను;
దారి జూపగలేను;
తప్పుజేసినవారి
దండింపగాలేను;

కష్టపడువారలను
కాపాడగాలేను;

అవనిపై...

పరుల కష్టము జూచి
పగిలిపోవును గుండె
మాయమోసము జూచి
మండిపోవును ఒళ్లు
పతిత మానవు జూచి
చితికిపోవును మనసు

అవనిపై...

... ... ...

అవకతవకలు నేను
సవరింపలేనపుడు,
'పరులకష్టముతోడ
పని యేమి మన' కనెడు
అన్యులనుజూచైన
హాయిగా మనలేను!

అవనిపై...

రాగ—

ప్రత్యూష

# ప్రపంచం

గడియగడియకు మారుప్రపంచం
గవ్వకునూ కొరగాని ప్రపంచం!
పారదోలపై బడెడుప్రపంచం
కొరగనే కొమ్మెక్కు ప్రపంచం
వలదనగ మెడబడెడు ప్రపంచం
వలచినచో వైదొలగు ప్రపంచం
ఆసపెట్టి ఆడించు ప్రపంచం
మోసపుచ్చి మురిపించు ప్రపంచం
సమరాలకు 'సయ్యో'నెడి ప్రపంచం
'శాంతిశాంతి'యని చాటుప్రపంచం
వక్రమార్గ వర్తనల ప్రపంచం
సక్రమ బోధల సల్పు ప్రపంచం
నీతిరహితమై నెగడు ప్రపంచం
నీతినియమముల నేర్పు ప్రపంచం
వియ్యాలకు వేంచేయు ప్రపంచం
కయ్యాలకు కాలుదువ్వు ప్రపంచం
నిప్పుదోపిడుల నిత్యప్రపంచం
చిలుక పలుకులను పలుకు ప్రపంచం
దయాధర్మముల దండి ప్రపంచం
తడిగుడ్డల మెడగోయు ప్రపంచం॥గడియ॥



90

